నవశిక్షిత సాహిత్యమాల

# సవాసేరు గోధుమలు

ప్రేమ్‌చంద్

రూపాంతరం

మన్నూ భండారీ

చిత్రాలు

జగదీష్ జోషి

అనువాదం

కె.ఎస్. వసంత లక్ష్మి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

శంకర్ ఒక పేద రైతు. సరళ స్వభావం కలవాడు. కాయకష్టం చేసుకు బతికే నిజాయితీ పరుడు. కపటం, మోసం, దగా అంటే గిట్టదు. దైవభక్తి గలవాడు. జీవితంలో అన్యాయంగా ఒక్క పైసా కూడా సంపాదించి ఎరుగడు. అలా అక్రమంగా గణిస్తే, తిరిగి భగవంతుడెదుట ఏమని జవాబు చెప్పగలను అని భయపడుతూ ఉండేవాడు.

ఒకనాడు శంకర్ ఇంటికొక సాధువు మహారాజు వచ్చాడు. శంకర్ సంతోషానికి అవధులు లేవు. అంతటి మహానుభావుడు తన ఇంట అడుగు పెట్టడం తన అదృష్టంగా భావించాడు. సాక్షాత్తూ ఆ భగవంతుడే తనకు కనపడుతున్నట్లు మురిసిపోయాడు. హడావిడిగా తన గుడిశెను శుభ్ర పరిచాడు. ఒక చాపవేసి దానిపైన ఆ స్వాముల వారిని కూర్చోబెట్టి ఆయన పాదాల దగ్గరే తానూ కూర్చున్నాడు.

శంకర్ పైకి సంతోషంగా ఉన్నా లోలోపల స్వాముల వారికి తినటానికి ఏదైనా మంచి భోజనం ఎలాగా పెట్టడం అని మథనపడ సాగాడు. తమలాంటి వాళ్ళు తినేవి జొన్నలు, స్వాములు వారికి జొన్నరొట్టెలు ఎలా పెట్టడమా అని వాపోయాడు. ఆయన తినలేకపోతే తనకు పాపం చుట్టుకుంటుదేమో. కానీ ఆయన ఆకలిని తీర్చకపోతే మరింత పాపం రాదూ! ఇపుడేం చేయటం? గోధుమలెక్కడినుంచి తేవటం? తనకూ పెద్దింటి వారెవరితోనూ అస్సలు పరిచయాలే లేవు. బీదవారిండ్లలో గోధుమలుండవు. వారికి ఒక పూట కడుపు నిండటమే మహాభాగ్యమాయె మరి!

చాలాసేపు ఆలోచించాక, పండిత్ జీ జ్ఞాపకం వచ్చాడు. వెంటనే తన కొడుకును పంపి వేగంగా ఒక సవాసేరు గోధుమలు పట్టుకు రమ్మని పంపేడు. తెస్తూనే శంకర్ భార్య వాటిని పిండి చేసింది. స్వాములవారు వాటిని తృప్తిగా తిని, శంకర్‌ను ఆశీర్వదించి వెళ్లిపోయారు. శంకర్ సరిగంగ స్నానం చేసినంత సంతోషించాడు.

పండితుడు శంకర్ వద్దనుండి సంవత్సరానికి రెండుసార్లు శిస్తు వసూలు చేసే వాడు, పొలం శంకర్‌దే అయినా ఆమాటా ఈ మాటా చెప్పి వసూలు పూర్తి చేసేవాడు. అయినాగానీ శంకర్ ఏమీ అనుకోకుండా, ఆనందంగానే ఇచ్చుకునే వాడు. ఎందుకంటే, పూజా పునస్కారాలు చేసుకునే ఈ పండితుడికి తాను ఏదైనా ఇస్తే కొంత పుణ్యం దక్కుతుంది గదా అనుకునే వాడు. అది తన ధర్మంగా భావించేవాడు.

చైత్రమాసంలో గోధుమ పంట కోతలయ్యాయి. ఉట్టి సవాసేరు గోధుమలు వెనక్కియ్యటానికి సిగ్గు పడ్డాడు. అంత ధనవంతుడైన పండితుడికి ఇంత చిన్న మొత్తం యిస్తే బాగుండదేమో అని అనుకున్నాడు. కానీ అప్పన్నాక తీర్చవలసిందే గదా! తీర్చకపోతే మహా పాపం. అందుకని తాను శిస్తుగా కట్టే ఐదుసేర్ల గోధుమలకు బదులుగా ఏడున్నర సేర్ల గోధుమలు ఇస్తూ మనసులో అనుకున్నాడు సవాసేరు గోధుమలు వడ్డీతో సహా ఇచ్చి వేశానని. కానీ అవి ఇస్తున్నప్పుడు, తన అప్పు విషయం ఎత్తలేదు. పండితుడు అన్నీ తెలిసిన వాడు. అర్థం చేసుకుంటాడని భావించాడు.

కల్లాకపటం తెలియని శంకర్, తన తరపునుండి అప్పును తీర్చి వేశాననుకుంటున్నాడు. కానీ మోసగాడైన పండితుడు మనసులోకి దురాలోచన రానే వచ్చింది. అంచేత పండితుడు కూడా సవాసేరు గోధుమల మాటే ఎత్తలేదు. ఏడేళ్లు గడిచినా కూడా ఈ మాటే ఎత్తలేదు. ఈ సవాసేరు గోధుమల అప్పుకు బదులుగా శంకర్‌ను తన ఉచ్చులో ఇరికించాలని వల పన్నాడు.

ఈ ఏడేళ్లల్లో పండితుడు గ్రామ పెద్ద అయ్యాడు. బీదసాదలకు అప్పులివ్వ నారంభించాడు. వాళ్ల దగ్గరనుండి తిరిగి పెద్ద మొత్తాలలో వడ్డీ వసూలు చేసేవాడు. మొదట్లో ఒక చిన్న పంచాంగమూ, విస్తరీ పుచ్చుకు తిరిగే పండితుడు ఈనాడు చిట్టా పద్దుల ఖాతా పుస్తకం చంకన పెట్టుకుని తిరిగాడుతున్నాడు. చూస్తుండగానే ఒక భవంతి నిర్మించుకున్నాడు.

ఇటు శంకర్ పాపం రైతు నుండి కూలీగా మారేడు. తమ్ముడు మంగళ్ దెబ్బలాడి వేరుపడ్డాడు. అంతా కలిసి ఉన్నప్పుడు ఎలాగో వచ్చిందాంతో కడుపు నింపుకునే వారు. ఇప్పుడు వేరుపడే సరికి పస్తుల్లో కొచ్చారు. ఉన్న ఆ మూడెకరాల భూమి పంపకాల తర్వాత

సగమై పోయింది. జోడెద్దు చెరొకటి వచ్చాయి. ఇంక పొలమేం సాగు అవుతుంది? కూలో నాలో చేసుకుని పొట్టపోసుకోవలసిన స్థితి ఏర్పడింది.

ఓ రోజున కూలీ ముగించుకుని ఇంటికి వెడుతూంటే శంకర్‌కు పండితుడు కనపడ్డాడు. "శంకర్, రేపొసారొచ్చి, నీ అప్పు లెక్క కట్టించుకుని, నాకు రావలసిన బాకీ తీర్చేసెళ్ళు" అన్నాడు.

శంకర్ తెల్లబోయాడు. "బాబూ తమ వద్ద నేనొక్క చటాకు ధాన్యంగానీ, ఒక్క పైసాగాని అప్పు తీసుకోలేదు. ఇంక లెక్కలేమిటి?" అన్నాడు.

పండితుడు నుదురు చిట్లిస్తూ గట్టిగా అరిచాడు. "భలేవాడివేనోయ్! నీ లెక్కకు ఒక్క చటాకు ధాన్యమూ అప్పులేదూ? పూర్తి ఐదున్నర మణుగుల గోధుమల అప్పున్నావు. ఎగ్గొట్టడానికి చూస్తున్నావా?"

శంకర్ చేతులు జోడించి మొరపెట్టుకున్నాడు. "మీ డబ్బు నాకెందుకయ్యా? భగవంతుడి ముందు నేనేం సంజాయిషీ ఇచ్చుకుంటాను అలా చేస్తే! బాబూ అయినా ఇన్ని మణుగుల గోధుమల అప్పెలా అయ్యింది?"

"ఏడేళ్ల క్రితం నీ కొడుకు నా దగ్గర్నుంచి సవాసేరు గోధుమలు తీసుకెళ్లాడా లేదా? నే చెప్పేది అబద్ధం కాదుగదా?" అన్నాడు పండితుడు.

ఇది విని శంకర్ మొదట ఆశ్చర్యపోయి తరవాత ఇలా అన్నాడు. "తీసుకున్న మాట నిజమేనయ్యా! కానీ నేను మీకు ఆ సవాసేరు గోధుమలకు బదులుగా ఏడున్నర సేర్లు గోధుమలు ఇచ్చేశాను. మీకు అసలూ వడ్డీ కూడా ముట్టినట్టే గదా!"

పండితుడు మోసకారి. తన అతి తెలివినుపయోగిస్తూ ఇలా అన్నాడు. "చూడు. ఎంత అప్పు రాసి ఉందో అంతా తీర్చవలసిందే గదా. నువ్వేదో నీకు తోచింది దక్షిణలా ఇచ్చావు. దానిని యిమ్మని నేనేమి అడగలేదే."

పాపం శంకర్‌కేం చెప్పాలో తోచలేదు. "అయ్యా! మీరిచ్చింది అప్పూ, నేనిచ్చింది దక్షిణానా? ఇదెక్కడి న్యాయం బాబూ?"

పండితుడి దగ్గర దీనికీ జవాబు సిద్ధంగా ఉంది. "నిజానికి నేనూ న్యాయం గురించే మాట్లాడుతున్నాను. అడిగి తీసుకుంటే అప్పు. సంతోషం కొద్దీ ఇచ్చేది దక్షిణా అనక మరేమంటారు?"

శంకర్ ఇక మారు మాట్లాడలేదు. పండితుడి మాటనెలా కాదనగలడు? అయినా ఉండబట్టలేక అడిగేశాడు. "నేను మీ దగ్గర్నుంచి సవాసేరు గోధుమలు తీసుకున్నాను. మరి తమరేమో నన్ను ఐదున్నర మణుగుల గోధుమలడుగుతున్నారు. ఇదేం లెక్క బాబూ?"

పండితుని వద్ద లెక్కలు కూడా సిద్ధంగా ఉన్నాయి. "ఈ ఏడేళ్లకూ వడ్డీ ఎవరు కడతారు? ఈ లెక్క కావలిస్తే మరెక్కడైనా తనిఖీ చేయించుకుని చూసుకో. ఏ మాత్రం తేడా ఉన్నా నీ అప్పంతా రద్దు చేసేస్తాను. నేనెంతో ధర్మం, న్యాయం తెలిసిన వాడిని. నేను ఒక రైతుకు అన్యాయం చేస్తానని ఎలా అనుకున్నావు?"

తనెంతో గొప్ప చిక్కులో ఇరుక్కున్నానని బోధపడింది శంకర్‌కి. చేతులు జోడించి అన్నాడు- "మీరు అప్పుడే అడగాల్సింది. అప్పుడేదో నాదగ్గర కాసింత పొలమైనా ఉంది. ఎలాగోలాగ సర్దుబాటు చేసి ఉండేవాడిని."

తప్పు తన మీద పడనిస్తాడా పండితుడు ఈసడింపుగా అన్నాడు. "ఇది మరీ బాగుంది. పుణ్యానికి పోతే పాపం ఎదురైందన్నట్టు. ఏదో పాపం పేదవాడు గదాని జాలిపడి ఎందుకులే అని అడగకుండా, నీ దగ్గరున్నప్పుడు నీ అంతట నువ్వే బాకీ తీరుస్తావని ఊరుకుంటే, నువ్వా మాట మరిచే పోయావు. పైగా నీకు దురాశ పుట్టినట్టుంది. అందుకే ఈనాడు తిండి గింజలు కూడా కరువై పోయాయి నీకు."

ఏనాడూ, ఎవ్వరినీ దగా, మోసం చేసి ఎరుగడు శంకర్. ఎవ్వరిదీ ఒక్క దమ్మిడీ కాజేసి ఎరగడు. తనమీద వేసిన ఈ అభాండానికి అతని కళ్లలో నీళ్లు వచ్చాయి. దండం పెడుతూ ఇలా అన్నాడు. "మీకు తెలీందేముందయ్యా, ఒంటిపూట కల్లోగంజో తాగి బతుకు వెళ్లదీస్తున్నాను. అన్ని గోధుమలెక్కడినించి తేగల్ను."

చెడ్డ బుద్ధిగల పండితుడు శంకర్ ఉన్న కష్టపరిస్థితిని చక్కగా అంచనా వేసాడు. వీలైనంత కొల్లగొట్టుకోవాలనే ఎత్తు వేశాడు. "ఏం చేస్తావో నీ ఇష్టం. ఎక్కడినించి తెస్తావో నాకు

తెలీదు. ఈ అప్పు ఇక్కడే తీర్చకపోతే భగవంతుడెదుట నిలబెడతాను. నన్ను మోసం చెయ్యగలవేమో గానీ, ఆ భగవంతుడిని మోసం చేయలేవు గదా! దేవుడికి నీ జిత్తులన్నీ వివరిస్తాను. నీ పాపాల చిట్టా చూసి నిన్ను తిన్నగా నరకంలోనే పడేస్తాడు. మోసం చేస్తే దక్కే ఫలితమేమిటో అర్ధమౌతుంది."

శంకర్ భయంతో వణికి పోయాడు. దేవుడి ముందు మోసగాడిలా నిలవాలా? పండితుని చిట్టా పద్దులో తన పేరు మోసగాడిలా నమోదు అయితే, దేవుడు తనకి నరకంలో కూడా చోటివ్వడు.

గడగడలాడుతూ ఇలా అన్నాడు శంకర్ "ఒద్దులెండి బాబూ. తమరిది ఒక్కొక్క గింజా అప్పు తీర్చేస్తాను. క్రిందటి జన్మలో ఏం పాపం చేశానో, ఈ జన్మలో ఎలానూ అనుభవిస్తూనే ఉన్నాను. రాబోయే జన్మకు కూడా ముళ్ళ బాటెందుకేసుకోవడం!"

పండితుడు మనసులో సంతోషించి పైకిలా అన్నాడు. వెళ్ళి బస్తాలు పట్టుకొచ్చి పడెయ్యి. నువ్విలా బస్తాలు పడేయటమేమిటి, నేనూ నీ బాకీ రద్దు చేసేస్తాను. అప్పుడింక నీకూ నాకూ మధ్యనే గొడవా ఉండదు. దేవుడి ముందర నువ్వు ఠీవిగా తలెత్తుకుని నిలబడవచ్చు. నీకు తిన్నగా స్వర్గంలోనే చోటిస్తాడా దేవుడు.

"బస్తాలే ఉంటే ఈ బాధంతా ఎందుకయ్యా! రెండు పూటలకీ సరిపడ్డ తిండిగింజలే సమకూరటం లేదు. ఒంటిపూట తిండి తోనే సరిపెట్టుకుంటున్నాం," అన్నాడు శంకర్.

ఈ మాట వింటూనే పండితుడు కోపంతో విరుచుకు పడ్డాడు. "ఒక క్షణం ముందర మాట ఇచ్చావు. ఇప్పుడు మాట మారుస్తావా! ఇలాంటి పాడుపన్ల వల్లే తిండి లేక అల్లాడుతున్నావు. బస్తాలు లేవంటే, ఇంక దేవుడి ముందర దోషిగా నిలబెట్టేస్తానంతే" అంటూ గదమాయించాడు.

శంకర్ పండితుడి కాళ్ళపై పడ్డాడు. వణికిపోతూ అన్నాడు. "నేనేం మాట తప్పాలనుకోవటం లేదయ్యా. మీరు కాస్త గడువిప్పిస్తే, నేను రాత్రి పూట కూడా కూలీ పని చేస్తాను. మీ గోదాములు నింపుతాను. ఈ జన్మలో చేసిన అప్పు ఈ జన్మలోనే తీర్చేస్తాను."

పండితుడన్నాడు. "ఏవిటోయ్ మరీ చెబుతున్నావు. ఏడేళ్ల గడువు చాల్లేదూ? ఇంక

ఒక్క రోజు కూడా ఆగటానికి వీల్లేదు. నీ దగ్గర గోధుమలు లేకపోతే, నోటు మీద సంతకం పెట్టు."

ఇంక శంకర్ ఏం చెయ్యగలడు? "మీ అప్పు తప్పకండా తీర్చాల్సిందె బాబూ గోధుమలుగా తీసుకుంటారో లేక నోటు రాయించుకుంటారో మరి మీ ఇష్టం. మీరెలా చెబితే అలా చేస్తాను," అన్నాడు.

పండితుడికి కావలిసిందిదే. ఈ మాట వింటూనే చాలా ఆనందించాడు. "బజారు ధరైతే ఐదుసేర్లకు కడతారు. కానీ నేను మాత్రం నీకు ఐదుంపావులెక్కన వేస్తాను. అసలే నా మనసు వెన్న లాంటింది. పేదవాళ్ల దుఃఖం చూసి ఓర్చుకోలేను."

అప్పుడు శంకర్ ఇలా అన్నాడు, "అయ్యా! ఎలాగూ ఇచ్చుకుంటున్నప్పుడు మళ్లా వేరేగా ఎందుకులెండి. బజారు లెక్కనే కానివ్వండి. ఒక పావు తక్కువ యిచ్చానన్న పాపం నాకెందుకు?"

మళ్లీ లెక్కగట్టాడు. గోధుమల ధర అరవై రూపాయలు. వందకి మూడు రూపాయల చొప్పున వడ్డీ వేశాడు. ఏడాది పాటు వడ్డీ గనక కట్టక పోతే, వడ్డీ మూడున్నర శాతానికి పెంచేట్టు, కాగితాల తయారీకి ఒక రూపాయి, తపాలా బిళ్లలకైన ఖర్చు కూడా శంకర్ నెత్తిన రుద్దేశాడు పండితుడు.

ఈ విధంగా శంకర్ చిత్తుగా ఓడిపోయి గుడిశెకు చేరుకున్నాడు. దురాశాపరుడూ, వంచకుడూ అయిన పండితుడు శంకర్‌ను అతడు పన్నిన వలలో నిర్దాక్షిణ్యంగా ఇరికించాడు. ముక్కుకు సూటిగా పోయే శంకర్ ఈ మోసాన్ని గ్రహించలేదు.

ఇప్పుడు శంకర్ మనసులో ఒకే ఒక ఆలోచన. ఎలాగైనా సరే పండితుని పద్దు పుస్తకంలోంచి తన పేరు తొలగించుకోవాలి. ఈ జన్మలోని అప్పు ఈ జన్మలోనే తీర్చేయాలి. పాపం, శంకర్ తానొక నిరుపేద రైతుగా జన్మించాననే విషయం మరిచి పోయాడు. పేద రైతులకు అప్పులనుండి విముక్తెలా దొరుకుతుంది. ఈ జన్మకూ, మరే జన్మకూ కూడా ఉండదు. ఉండబోదు.

అప్పు తీర్చాలనే ధ్యాసలో వంచిన నడుమెత్తకుండా పని చేయసాగేడు. ఇప్పటివరకూ,

కేవలం పగలే పని చేసేవాడు. ఇప్పుడు రాత్రుళ్లు కూడా కూలీపని చేయనారంభించాడు. మొదట్లో ఒక్కో రొట్టె తినేవారు. ఇప్పుడదీ లేదు. శంకర్, అతని భార్యా ఇప్పుడు పొద్దున్నా, సాయంత్రం కూడా ఏవో నాలుగ్గింజలు నమిలి సరిపుచ్చుకుంటున్నారు. కొడుక్కోసం మాత్రం ఓ రెండు రొట్టెలు చేసేది.

అసలెప్పుడూ శంకర్ ఏ సరదాలూ ఎరుగడు. గంజాయీ, సారాయి వంటి అలవాట్లపై వేలేసి ఎరగడు. ఒక్క పైసా పెట్టి కాస్త పొగాకు కొనుక్కుని నమిలేవాడు. మంచిదో, చెడ్డదో ఈ ఒక్క అలవాటు మాత్రం అతడికుండేది. ఇప్పుడదీ మానుకున్నాడు. చిల్లంపట్టే గొట్టాన్ని విరగ్గొట్టేశాడు. పొగాకు డబ్బాను కూడా పగల గొట్టేశాడు.

శంకర్ దగ్గర బట్టలు కూడా అంతంత మాత్రంగానే ఉండేవి. ఇప్పుడుత్త కొల్లాయి మాత్రమే వేసుకుంటున్నాడు. ఎముకలు కొరికే పుష్యమాసపు చలిలో కూడా ఆ చిన్న కొల్లాయి గుడ్డతోనే కాలక్షేపం చేయనారంభించాడు. చలికి శరీరం బిగుసుకుపోయినట్టనిపిస్తే, కాస్సేపు చలి కాచుకుని తిరిగి పనిలో మునిగి పోయేవాడు.

గ్రామ ప్రజలు శంకర్ పడే కష్టాన్ని చూసి ఆశ్చర్యపోయారు. స్త్రీలు జాలితో కన్నీరు కార్చారు. దుఃఖంతో అనేవారు, "అప్పు తీరుస్తున్నావా, శరీరాన్ని బలి చేసుకుంటున్నావా?" పెద్దవాళ్లూ, వృద్ధులూ, "ఇలా ప్రాణాంతకంగా పని చెయ్యకు. అప్పు మెల్లిగా తీరుద్దువుగాన్లే. పండితుడు నిన్నేం చేయగలడు" అంటూ వారింప చూశారు. కానీ శంకర్ ఎవ్వరి మాటా విన్లేదు. ఎవరినీ పట్టించుకోకుండా పూనకం వచ్చినట్టు పని చేయసాగేడు.

ఇలా కొన్ని నెలలు గడిచాయి. శంకర్ ఒంటి మీద కండన్నది మిగలలేదు. ఎముకల గూడులా మిగిలాడు. కానీ ఎలాగో అరవై రూపాయలూ కూడ బెట్టాడు. తలమీంచి బరువు దింపేసినట్లయింది శంకర్‌కి. పండితునికి తానివ్వవలసిన అప్పులోని అసలు ముట్ట చెప్పేస్తాను. వడ్డీ తాలూకు పదిహేను రూపాయలూ కూడా త్వరలోనే ఇచ్చేస్తాను. దీనికి పండితుడు ఒప్పుకుంటాడు. అని ఆలోచించాడు శంకర్.

డబ్బుతో ఆనందంగా పండితుడి ఇంటివైపు కెళ్లాడు శంకర్. రూపాయల మూటను పండితుడి కాళ్ల దగ్గరుంచి ఇలా అన్నాడు. "అయ్యా ! ఇవిగో మీ రూపాయలు. ఇవి

తీసుకుని, మీ ఖాతాలో నుంచి నాపేరు కొట్టేయండి. అది ఇన్నాళ్లూ నా గుండెల మీద కుంపటిలా కూర్చుంది. నా గుండెల్లో ఎవరో కాల్చిన గునపాలతో గుచ్చినట్టుండేది. ఇంక నేను హాయిగా ఊపిరి పీల్చుకుంటాను."

పండితుడికిది నమ్మశక్యం కాలేదు. డబ్బును కిందామీదా లెక్కలు గట్టి రెట్టింపు చేసే కళ తనొక్కడికే వచ్చనుకున్నాడు. ఈ మూర్ఖపు రైతుకు డబ్బును తరగ్గొట్టడమే వచ్చనుకున్నాడు. మరి శంకర్‌కి ఇంత డబ్బెలా వచ్చింది? రూపాయల మూట ఎదురుగ్గా ఉంటే నమ్మకుండా ఎలా ఉండటం?

పండితుడు నిజాయితీ పరుడై యుండుంటే, రూపాయలు చూసి సంతోషించుండేవాడు. అతని మనసంతా దుర్బుద్ధే. శంకర్ తన గుప్పిట్లోనించి ఎక్కడ తప్పించుకు పోతాడో అని భయం పట్టుకుంది.

"ఎక్కడ్నించైనా అప్పుతెచ్చావా?" చిన్నగా అడిగాడు పండితుడు.

"లేదయ్యా. ఏదో తమరి దయవల్ల మంచి మజూరీ గిట్టింది. చాలా కష్ట పడ్డానయ్యా" అన్నాడు శంకర్.

చచ్చినట్టు శంకర్ చేతిలోంచి సంచీ అందుకున్నాడు. రూపాయలు లెక్కపెట్టాడు. పూర్తిగా అరవై రూపాయలూ ఉన్నాయి. పండితుడి ముఖంలోకి మళ్లీ కళ వచ్చింది. వెంటనే అన్నాడు- "ఇవి అరవై రూపాయలే ఉన్నాయే. మరి వడ్డీ ఎవరు కడతారు? మహా అసలూ వడ్డీ చెల్లించిన వాడిలా ఖాతాలోంచి పేరు కొట్టేయమంటున్నావు."

"ఆ మాత్రం నమ్మకం ఉంచండయ్యా. రెండుమూడు నెలల్లో మీ వడ్డీ కూడా తీర్చేస్తాను. ఖాతాలోంచి నాపేరు కొట్టేసి నన్ను ఋణ విముక్తుణ్ణి చెయ్యండి బాబూ!" మొరపెట్టుకున్నాడు శంకర్.

పండితుడు కఠినంగా అన్నాడు. "ఋణ విముక్తుడవ్వాలంటే ముందు నా పైకమంతా చెల్లించు. ఖాతాలో నీ పేరు ఉంటేనే నువ్వు బాకీ సరిగా తీర్చటం లేదు. పేరు తీసేస్తే, ఇంక నా ముఖం చూడవు. మీలాంటి వాళ్లను నమ్మేంత మూర్ఖుణ్ణి కాను."

ఈ మాట శంకర్‌కి కోపం వచ్చింది. "అయ్యా! ఏ ఒక్క మనిషీ ఒంటిగా చేయలేనంత కాయకష్టం చేశాను. మీరు నేనెంత బాకీ అని చెప్తే అంతకీ ఒప్పుకున్నాను. అదీ సవాసేరు గోధుమలకు బదులుగా. మీరు చేసిన ప్రతి అన్యాయాన్నీ సహించాను. అయినా మీకు నా మీద నమ్మకం లేదంటే ఎలా బాబూ?"

ఈ మాట వినగానే పండితుడు తోక తొక్కిన తాచులా లేచాడు. కళ్లెర్రజేస్తూ అన్నాడు. నేనిచ్చింది వెనక్కిమ్మంటున్నాను. అన్యాయమేమిటి ఇందులో? అప్పు తీర్చమంటుంటే అన్యాయం చేస్తున్నానంటావా? నా బాకీ పూర్తిగా తీర్చెయ్యి. ఖాతాలోంచి నీపేరు తీసేస్తా. నీలాంటి వాళ్లతో అనవసరపు వాదన నాకిష్టం లేదు.

అంటూ పండితుడు లేచి లోపలికెళ్లబోతూ తిరిగి ఇలా అన్నాడు, "నే చెప్పేది శ్రద్ధగా విను. ఇంకనుంచి వడ్డీ మూడున్నర శాతం. నీక్కావలిస్తే ఈ అరవై రూపాయలు కూడా పట్టుకుపో. లేదా ఇక్కడొదిలెయ్. నీ ఖాతాలోకి జోడిస్తాను."

శంకర్ ఆలోచించాడు. ఎన్నో నెలల నుండి పస్తులున్న తన పరివారం ఈ డబ్బు చూస్తే ఒక్కసారిగా చలించవచ్చు. ఏ మాత్రం చాపల్యానికి లొంగినా ఈ డబ్బు కాస్తా ఖర్చయిపోతుంది. అందుకే ఇలా అన్నాడు. "ఈ రొక్కం మీ దగ్గరే ఉంచండయ్యా. వడ్డీ తాలూకు పదిహేను రూపాయలూ ఎవరి దగ్గరైనా అడిగి తెస్తాను."

రూపాయల సంచి తీసుకుని పండితుడు సంతోషంగా లోపలికెళ్ళి పోయాడు. శంకర్ విచారంగా బయటకు నడిచాడు. పదిహేను రూపాయలు ఎవరి దగ్గరైనా అప్పు తీసుకుని, పండితుడి బాకీ తీర్చేసి, ఆయన ఖాతాలోంచి తన పేరు కొట్టేయించుకోవాలి. మరింత కాయకష్టం చేసి ఎలాగో ఈ అప్పుకూడా తీర్చేస్తాను అని అనుకున్నాడు.

గ్రామం అంతా తిరిగాడు. అందరి ముందరా చేతులు జోడించాడు. అర్థించాడు. గోడు పెట్టుకున్నాడు. కానీ ఎవ్వరూ పదిహేను పైసలు కూడా ఇచ్చేందుకు సిద్ధపడలేదు. వాళ్లకు అతని మీద నమ్మకమైతే ఉంది. కానీ ఎవరూ పండితుని కోపానికి కారణం కాదలుచుకోలేదు. పండితున్నెదిరించి శంకర్‌కు సహాయం చేస్తే, తమల్ని ఈ గ్రామంలో బ్రతకనీయడు. అందుకే అందరూ తమకు పట్టనట్టూరుకున్నారు.

అన్ని చోట్లనించి నిరాశ చెంది, గుడిసెకు చేరుకున్నాడు శంకర్. అతన్ని బాధించిందల్లా ఒకటే విషయం. ఇన్నాళ్ళుగా తాను పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. పండితుడి నుండి తాను ఋణ విముక్తుడు కాలేక పోయాడు.

గుడిసెలో ఓ మూలగా ముఖం దాచుకుని పడుకున్నాడు. ఆ రోజు పనిలోకి పోలేదు. ఇప్పుడు శంకర్ మనసులోకి వేరే తరహా ఆలోచనలు రాసాగాయి. నిన్నటి వరకూ అప్పు తీర్చాలన్న ధ్యాసే ఉండేది. ఎన్నటికీ తీరని బాకీని తీర్చే ప్రయత్నం ఎందుకులే అని ఇప్పుడనుకున్నాడు.

శంకర్‌కి తన భార్యా బిడ్డలు గుర్తొచ్చారు. ఇన్నాళ్ల నుండి సరైన తిండీ తిప్పలూ లేక తన భార్య పుల్లలా చిక్కిపోయింది. పిల్లవాడి ముఖంలో అయితే చిరునవ్వే లేదు. దేవుడు తనని నరకానికి పంపితే పంపనీ గాక. ఈ ఏడాది బట్టీ తాను అనుభవించింది నరకం గాక మరేమిటి?

పండితుడి మోసకారితనం శంకర్‌కు మొండి ధైర్యాన్నిచ్చింది. ఇప్పుడు పని చేస్తే వచ్చిన డబ్బులతో కడుపునిండా భోజనం చేస్తున్నాడు. భార్యా, కొడుకునూ బాగా చూసుకుంటున్నాడు. మొదట్లో ఒఠి పొగాకు మాత్రమే నమిలే అలవాటున్న శంకర్ ఇప్పుడు గంజాయి కూడా అలవాటు చేసుకున్నాడు.

కడుపు నిండా దొరికే సరికి పిల్లవాడి ముఖంలో సంతోషం కనబడుతోంది. భార్యా, కొడుకూ కొంచెం లావెక్కారు. అప్పుడప్పుడూ భార్య కోసం గాజులో తిలకమో ఏదో తెచ్చి పెట్టేవాడు. లేకపోతే పిల్లాడికేదైనా ఆటబొమ్మ తెచ్చిచ్చేవాడు. ఇక అప్పు మాట తలపెట్టడం మానేశాడు.

ఇలా మూడేళ్లు గడిచాయి. పండితుడు కూడా మళ్లీ అప్పు మాటన్నది ఎత్తలేదు. కానీ తన ఖాతా పుస్తకంలో శంకర్ పేరిట వడ్డీ మీద వడ్డీలు ఎక్కిస్తూనే ఉన్నాడు. రొక్కం చాలా మొత్తంగా పెరిగినాక, ఒక రోజున శంకర్‌కు పిలుపు వచ్చింది. వచ్చి నిలబడ్డాడు శంకర్.

పండితుడు అడిగాడు. "ఏమిటి అప్పు మాటే ఎత్తడం మానేశావు? నీ పేరున ఎంత బాకీ ఉందో తెలుసా?"

శంకర్ మొండితనం నేర్వనే నేర్చాడు. ఏమీ పట్టనట్టు ఇలా అన్నాడు. "నాకేం తెలుసు?

పద్యులు రాసేది తమరేనాయె! అంవేళ తమరికే తెలియాలి."

పుస్తకం తెరిచి చూసి, "నువ్విచ్చిన అరవై పోను ఇంకా నూట ఇరవై రూపాయలు బాకీ ఉన్నావు" అన్నాడు పండితుడు.

మళ్లా అదే మొండితనంతో జవాబిచ్చాడు శంకర్. "తప్పకుండా అయి ఉంటుదయ్యా. మొదట సవాసేరు గోధుమలు కాస్తా అరవై రూపాయలైనాయి. ఇప్పుడు పదిహేను రూపాయలు తప్పకుండా నూట ఇరవై రూపాయలు అయి ఉంటాయి."

"అయితే మరి నా అప్పు తీర్చెయ్యి. ఇంకా ఆగటానికి కుదరదు నాకు" అన్నాడు పండితుడు.

ఈసారి శంకర్ చేతులు జోడించనూలేదు. బ్రతిమిలాడనూ లేదు. ధైర్యంగా ఇలా అన్నాడు. "ఈ జన్మలో మీ అప్పు నేను తీర్చలేను. వచ్చే జన్మలో నా దగ్గర నుంచి తీసుకోండి."

శంకర్ ఇచ్చిన జవాబు విని పండితుడు మండిపడ్డాడు. "అప్పూ ఈ జన్మలోనే తీసుకుంటాను. వడ్డీ కూడా ఈ జన్మలోనే వసూలు చేస్తాను."

"మీరు తీసుకునేందుకు నా దగ్గరేమయినా ఉంటేగదా! ఒక్క ఎద్దు ఉంది. కావలిస్తే తీసుకోండి. నా యింట్లో దానికీ దాణా సరిగా లేదు. మీ ఇంట్లో ఉంటే దానికి సరైన తిండైనా దొరుకుతుంది" అన్నాడు.

"ఎద్దూ,దూడా నేనేం చేసుకుంటాను?" పండితుడు ప్రశ్నించాడు. శంకర్ ఏమీ లేనూ లేదు. ఏమీ ఇవ్వదలుచుకోనూ లేదు. అందుకే తిన్నగా అడిగేశాడు పండితుణ్ణి. "మరింకేం కావాలయ్యా? నాదగ్గరింకేమీ లేదాయె. మేమూ పేదవాళ్లం. రోజూ రెక్కాడితే గానీ, డొక్కాడదు మాకు. మా దగ్గర డబ్బూ దస్కం ఎక్కడున్నాయి మీ కివ్వటానికి?"

అప్పుడు పండితుడన్నాడు. "డబ్బూ దస్కం లేకుంటేనేం? నువ్వున్నావుగా? నా బాకీ తీర్చెయ్యి లేకపోతే ఈ రోజు నుండి నీ మీద హక్కు నాదే."

పండితుడాడిన నాటకం శంకర్‌కు అర్థం కాలేదు. పైగా నవ్వు వచ్చింది. "నన్నేంజేసుకుంటారు బాబూ?" అమాయకంగా అడిగేడు.

"వడ్డీకి బదులుగా నువ్వీ రోజునుండి నా పొలంలో పని చేయాలి. యింకెక్కడా పని చెయ్యటానికి వీల్లేదు." ఖండితంగా అన్నాడు.

"వడ్డీకి బదులుగా నేను మీ పొలంలో పనికొస్తే, మరి మేమేం తినేదయ్యా" అడిగాడు శంకర్.

"రోజుకో అర్ధ సేరు జొన్నలిస్తాను. కడుపు నింపుకోటానికి అది చాలు" అన్నాడు.

"నాకు జొన్నలిస్తున్నారు. మరి మా ఇంట్లోళ్లేం తింటారయ్యా "అన్నాడు శంకర్.

"ఏం, నీ పెళ్లానికీ, పిల్లాడికీ  కాళ్ళూ, చేతులూ లేవా? కూలో నాలో చేసుకు బతుకుతారు." కోపంగా జవాబిచ్చాడు పండితుడు.

ఈ మాట వింటూనే శంకర్ ఆలోచనలో పడ్డాడు. పండితుడు ఎంత మోసపు ఎత్తు వేశాడు? ఈ మారు పండితుని ఉచ్చులో తాను బాగా ఇరుక్కున్నాడు. భయపడుతూ అన్నాడు. "అంటే నేను జన్మకంతా బానిసైపోతానయ్యా. నాశనమైపోతానయ్యా. నా ఇంటిలో వాళ్లూ నాశనమైపోతారయ్యా!" కళ్ల నీళ్లతో మొరపెట్టుకున్నాడు.

పండితుడు ఏ మాత్రం చలించ లేదు. తన తెలివికి మనసులోనే ఉప్పొంగిపోయాడు. "దాన్ని బానిసపటం అంటావో, కూలీ పనే అంటావో, నా బాకీ వసూలు కాకుండా నిన్ను వదల్ను." పంతంగా అన్నాడు.

శంకర్ మరోసారి బ్రతిమిలాడేడు. "అంత పని చెయ్యకండి బాబూ, ఇది చాలా అన్యాయం."

పండితుడిలా జవాబిచ్చాడు. "నాడబ్బు నేను వాపసు అడగటం అన్యాయమా! కావాలంటే గ్రామం లోని పెద్దలనడిగి చూడు. కావలిస్తే పంచాయితీ పెట్టుకో. ఎవరైనా ఇది అన్యాయమని ఒక్కమాటంటే నాకు దొంగలకేసే శిక్ష వేయించుకుంటా" అన్నాడు.

ఇంక తనకే దారీ లేదని తెలుసుకున్నాడు. గ్రామ పెద్ద లెలాగూ పండితుడి తరఫే మాట్లాడతారు. పంచాయితీ కూడా ఆయనవైపే తీర్పిస్తుంది. తన మాట ఎవ్వరూ వినరు. పేదవాడి మాట ఎవరు వింటారు?

తన ఎద్దును తనింట్లోనే కట్టి ఉంచేశాడు. తాను పండితుడు వెంట నడిచాడు. వెనక ఏడుస్తూ నిలబడింది శంకర్ భార్య. కొడుకు కూడా ఏడ్చాడు. కానీ ఎవరి మనసులూ కరగలేదు. పండితుడు చేసిన ఈ అక్రమానికి విరుద్ధంగా ఎవరూ నోరు మెదపలేదు. పాపం సవాసేరు గోధుమలకు బదులుగా శంకర్ తన జీవితాన్ని ఫణంగా పెట్టాల్సివచ్చింది.

తెల్లవారకముందే పండితుడు శంకర్‌ని పొలం మీదకి తోలేవాడు. ఇక ఆ పైన ఎండైనా, చలైనా, వానైనా శంకర్ ఎప్పుడూ పొలం పనిలోనే ఉండేవాడు. పని పూర్తయ్యే సరికి, పండితుడింట్లో మోెడు పని సిద్ధంగా ఉంచేవాడు. నాగలి విప్పేక పశువులకైనా కాస్తంత విశ్రాంతి ఉంటుందేమో గానీ, శంకర్‌కి మాత్రం ఒక్క ఘడియ కూడా తీరుబాటుండేది కాదు.

పొలాని కెడుతూంటే ఎప్పుడైనా శంకర్ తన కొడుకును చూసేవాడు. తలమీద వాడికి రెట్టింపు బరువు మోస్తూ కనపడేవాడు. కొడుకు కష్టంలో పాలు పంచుకోవాలని మనసులో ఆరాటంగా ఉండేది. కానీ తాను పండితుడి బానిస. ఇతరుల పని చేయటానికి వీలు లేదు.

అప్పుడప్పుడు భార్యకూడా ఏవో పనులు చేస్తూ కనబడితే మనసు తల్లడిల్లి పోయేది. బానిసగా మారేక, సుఖమూ, దుఃఖమూ ఏవీ తనవి కావు కదా! తన ఏడుపూ తనది కాదు. తన నవ్వూ తనది కాదు. అన్నీ యజమాని స్వంతమే. తానొక జీవం లేని తోలు బొమ్మలా పని చేసుకుంటూ పోవడమే.

ఇలాగే చచ్చీచెడీ రాత్రింబవళ్లు పని చేస్తూ ఇరవై ఏళ్లు గడిపాడు. బలంగా ఉండే శంకర్ ఇప్పుడు వయస్సు పైనబడే సరికి ముసలిగా తయారయ్యాడు. శంకర్ కొడుకు ఇప్పుడు యువకుడైనాడు. చేతికి అందివచ్చిన కొడుకున్నా శంకర్‌కి సుఖం ప్రాప్తి లేదు. వృద్ధాప్యంలో కూడా పండితుడింట్లో రాత్రి పగలు పని చేయక తప్పటం లేదు.

ఆఖరికి ఒకనాడు పొలం దున్నుతూ, శంకర్ ముఖం తిరిగి పడి పోయాడు. ఆ పడిన వాడు మరికలేవనే లేదు. కబురు వింటూనే భార్యా, కొడుకూ పరుగు పరుగున వచ్చారు. శంకర్ భార్య గుండెలదిరేలా ఏడ్చింది. చిక్కి శల్యమైన తండ్రి శరీరాన్ని వాటేసుకుని విలపించాడు కొడుకు.



ఆ సమయానికి పండితుడు కూడా అక్కడికి చేరుకుని వేదాంతం వల్లించనారంభించాడు. "శంకర్ చాలా అదృష్టవంతుడు. ఒక రోగం రొష్టు అన్నది లేకుండా పని చేసుకుంటూ చటుక్కున చనిపోయాడు. మట్టిలోంచి పుట్టిన శరీరం మట్టిలోనే కలిసి పోయింది. ఆ భగవంతుడే శంకర్‌ను తన వద్దకు పిలిపించుకున్నాడు. ఇంక ఏడ్చి ఏం లాభం" అంటూ కల్లబొల్లి మాటలాడేడు పండితుడు.

శంకర్ కొడుకును భుజాలు పట్టి లేపనెత్తాడు. అతనికి బోధపరుస్తున్నట్టన్నాడు. "తండ్రి ఋణాన్నింక కొడుకే తీర్చాలి. అదేగదా లోకరీతి. అదే ఆనవాయితీ. అందుకే

మనిషి కొడుకుల కోసం అలమటించేది" అంటూనే వెంటనే శంకర్ కొడుకును పొలానికి లాక్కెళ్లాడు. ఇంకా కుర్రవాడి కంట్లో కన్నీరింకలేదు. కంటితడి ఆరలేదు. నాగలిపిడి చేతి కందించాడు పండితుడు.

శంకర్ చచ్చిపోయాడు. శంకర్ కథ ముగిసింది. కానీ సవాసేరు గోధుమల కథ ఇంకా పూర్తి కాలేదు. శంకర్ బదులు అతని కొడుకు కిషన్ కథ మొదలైంది. ఈ కథ ఇలాగే సాగుతూ ఉంటుంది. శంకర్ కథలాగే ఇది కూడా సాగి పోతూంటుంది.

ఇప్పుడు పండితుడు ఖాతాలో శంకర్ పేరుకు బదులు కిషన్ పేరుంది. సవాసేరు గోధుమలకు బదులుగా ఇప్పుడు కిషన్ పొలం పని చేస్తున్నాడు. పండితుడి బానిసగా కిషన్ జీవితం కూడా గడిచిపోతుంది. ఒకవేళ కిషన్ చనిపోతే కిషన్ కొడుకుతో నడుస్తుందీ కథ.

పండితుడి వంటి మోసగాళ్లు అక్రమాలు చేసే వాళ్లు ఉన్నంత కాలం, శంకర్ లాంటి నిస్సహాయులైన పేద రైతులున్నంత వరకూ, సవాసేరు గోధుమల అప్పు కథ ఇలా కొనసాగుతూనే ఉంటుంది. కొడుకుల నుండి, కొడుకులకూ, తరతరాలకూ ఇలా సంక్రమిస్తూనే ఉంటుంది.

Laser Typeset by Fortune Publishers, Kalkaji, New Delhi-110 019
and printed at The Central Electric Press Naraina Phase I New Delhi-110 028

